ఆదర్శగ్రంథమాల,

నాల్గవగ్రంథము,

# కర్షకుని కాలగతి.

అనువాదకుడు.

లింగయ్యచౌదరి.

ప్రకాశకులు

ఆదర్శగ్రంథనిలయము

ఎలమర్రు, కృష్ణాజిల్లా.

స్వర్గవాసి.

శ్రీ రామమూర్తికి.

## — ఇందలి పాత్రలు. —

ఒకరైతు.
భార్య.
తల్లి.
తాత.
చిన్నపిల్ల.
ఒకపొరుగురైతు.
నలుగురు పెద్దలు.
స్త్రీలు. వృద్ధస్త్రీలు.
బాలురు. బాలికలు.

---

కలిపురుషుడు.
మంత్రి.
దూతలు.
రైతులదూత.
కూలివాడు (రైతులదూత మారువేషమున)
భటులు, ద్వారపాలకుడు.

# ప్రథమాంకము.

రైతు:— ( దున్నుచు పైకిజూచి ) పొద్దు నెత్తెక్కింది. ఎడ్డ నిప్పేయేళయింది. ( ఎడ్లవంకజూచి ) ఏఁ సాలొచ్చింది దా ? ఒకచుట్టు పోయొద్దాం. అకాఖరుసారే. తరవాత భోజనం. నాయింటే రొట్టతెచ్చుకొని మంచి పనిచేశా. ఇప్పుడింటికెల్లను. ఈ నూతొడ్డునే కూసోని రొట్టెతినేస్తా. ఒక సెంబుడునీళ్లుతాగి పడుకుంటినా చక్కని నిద్రపడుతుంది. అందాక గిత్తలు బాగా మేస్తాయికూడ. తరవాత మళ్ళా నాగలి కడతా. బగవంతుడిదయయుంటె దుక్కిగూడా యేళకవుతుంది.

( దూతప్రవేశము. ఒక పొదమాటున దాగును )

దూత:— ఈరై తెప్పుడు దేవుణ్ణే తలుస్తుంటాడు. కొంచె మాగితె తెలుస్తుంది వీడితిక్క. హుఁ వీడిరొట్టె కాజేస్తాను. కూసేపాగితె రొట్టెకనపడక దానికోస మెతుకుతాడు. పాపమబ్బాయి కాకలైతె దేవుణ్ణి గీవుణ్ణి మరిచిపోయి బూతులుదిట్ట కేంజేత్తాడు ?

( రొట్టెను సంగ్రహించి పొదచాటునుండి జూచుచుండును )

రైతు:— ( దున్నుటాపి ఎడ్లను విడచిపెట్టి ) బాబా కైలాశపతికీజై కావేటిరంగడికీజై ( బట్టయున్న చోటికిబోయి ) అబ్బ బలే ఆకలవుతుండాది. ఇంటిది పెద్దరొట్టె

చేసింది. కాని అంతా యిప్పుడే తినేత్తా. అరె !-ఏదీ? తేదే ! వొకేళ గడ్డికింద పెట్టానేమో. ( చెత్తలేపి ) ఏమిటి ! యిక్కడా లేదే ! రొట్టేమయింది. ( గడ్డి పరకలు చిందరవందరగ జిమ్మును. )

దూత;- (పొదచాటునుండి మెల్లగ) ఎతుక్కో. ఎతుక్కో. అది నాదగ్గిరుందిలే.

రైతు:- (నాగలి నవలకుదోసి మరల గడ్డిలో వెదకుచు) గమ్మత్తుగావుందే. ఇక్కడికెవరూరాలేదు. రొట్టె మాయమైంది. ఒకేల పిట్టలన్నా తిన్నాయనుకోటానికెక్కడెక్కడా సిన్నపలుకైనాలేందే ! ఎవరూ రాకపోయినా ఎవరో తీసికెళ్ళే వుండాలి.

దూత:- (లేచిచూచును) ఆఁ. ఇప్పుడిక తిట్టకమానడు. వల్లోపడ్డట్టే.

రైతు:- రొట్టిక దొరికేటట్టులేదు. మంచిదే. ఏమిచేయుదును. పర్వాలేదులే! తిండిలేకపోతే చత్తానా ? ఎవడన్నా ఆకలైతే పట్టుకుపొయ్యాడేమొ ! పాపము దేవుడాడికి మేలుచేత్తే బాగుంటాది.

దూత:- (ఉమియుచు) ఛీ ! పాడుముండాకొడకా; ఎత్తికెల్లినాడిని తిట్టకుండా వాడికి మేలుకోరతన్నావా ? యిట్టాటోణ్ణేమిసేత్తాను.

(రైతు యలసటదీర్చుకొని విశ్రమించుచున్నాడు.
ఈశ్వరుని దలచికొని నిద్రించును.)

దూత:- (పొదలోనుండి బయల్పడి) గప్పాలుకొట్టేవాళ్ళకు మాటలు బాగావస్తాయి. "నీవు నరకంలోకి రైతుల్నె వర్ని తీసుకు రాటములేదు. చూడు మేమంతా షాహు కార్లని వ్యాపారుల్ని యింకా అనేక రకాల వాళ్ళను రోజూ యెంద రెందర్ని నరకాన్కి నేరుత్తుండామొ? రైతులింత తక్కువుంటానికి నీ తెలివితక్కువగా దంట్రా" అని వాళ్ళెత్తి పొడుత్తుండారు. ఇప్పుడీళ్ళని చిక్కించుకునే దెట్లాగో తెలవడంలేదు. నే నిప్పుడు రొట్టి కాజేసాను. వాడాకలిత్తో మాడుతుండాడు. కాని వాడినోటినుండొక తిట్టయినా రాలేదు. ఏం చెయ్యాల్లో నాకేం తెలవటంలేదు. పోతా, ఇదంతా చెప్పొట్టుసేత్తా.

(అదృశ్యమగును)

(అవనికజారును)



# ద్వితీయాంకము.

( నరకలోకము. కలిపురుషుడొక యున్నతాసన మధిష్ఠించి యుండును. అతనిమంత్రి వ్రాత పనిముట్లున్న రొక బల్లవద్దగూర్చుండి యుండును. ఇరువైపుల ఖడ్గహస్తులగు భటులు నిలబడియుందురు. కుడివైపున కలిసేవకులగు నైదుగురు దూతలును ఎడమ వైపున దర్వాజావద్ద ద్వారపాలకుడును వుందురు. )

ఒకదూత:— అయ్యా ? మూడు సమత్సరాల్లోను 22000 మందిని పట్టుకున్నాను. ఆళ్ళంతా వానుసెప్పినట్లు సేత్తానికి సిద్ధంగా వుండారుసామీ.

కలిపురుషుడు:— మంచిది. నీవిక పోవచ్చును.

( ఆ దూత నిష్క్రమించును. )

కలి:— ( మంత్రితో ) నేనలసిపోతిని. ఇంకా యేమైన పని యున్నదా ? ఎవరెవరి రిపోర్టులువచ్చినవి ? ఇంకెవరెవరివి రావలెను. ?

మంత్రి:— ( వ్రేళ్ళపై లెక్కపెట్టి క్రమముగ నొక్కొక్క దూత పేరును పేర్కొనుచుండును. దూతలును తమ తమ పేర్లు వచ్చినపుడు సలాము చేయుచుందురు. ) సావుకార్ల దూతరిపోర్టువచ్చినది. అతడింతవరకు మొత్తం 1836 మందిని వలలోవైచికొనెను. వ్యాపారుల

దూత 9643 మందిని మోసగించి చేతిలో బెట్టు
కొనెను. వకీళ్ళదూత 3423 మందినిన్నీ స్త్రీలదూత
186315 మందిని వివాహమాడిన వారిని, 17438
కన్యలను వశపరచుకొని యున్నట్లు వారి వారి నివేది
కలవలన విశద మగుచున్నది. ఇంక ఒకని రిపోర్టు
మాత్రమే వచ్చియుండలేదు.

కలి.— మంచిది. అదియు నేడేవిందుము. పిలువుము.

మంత్రి:— (ద్వారపాలకునుద్దేశించి) ఒరే రైతులదూతను
బిలువుము.

ద్వా. పా:— చిత్తంబాబూ.

(రైతులదూత రొట్టె చేత బట్టుకొనివచ్చి కలిపురుషునికి నమ
స్కారమాచరించును.)

రై. దూ:—పెభో, నానీవని సేయలేను. ఉంకొకపని యిప్పిం
చండయ్యా!

కలి:— ఏంపని? నీవు వాగేదేమిటిరా? జాగ్రత్తగా మాట్లా
డుము. నీ నివేదికజూపుము. ఈ వారములో నెం
దరురైతులుజిక్కిరి ?

రై. దూ:— (ఏడ్చుచు) ఒక్కడూ లేడు.

కలి:— ఏమీ ? ఒక్కడును జిక్కలేదా? అట్లయితే నీవేమి
జేస్తుంటివి? ఇష్టమొచ్చినట్లు దిరుగుచుంటివా?

రై. దూ:— నానెక్కడా తిరగలేదండీ బాబూ; రోజంత
కష్టపడి అదేపనిగా పెయత్నం సేసానండి. కా
పెయోజనం లేకపోయిందండి. సూడండి. నానొ

రైతుదగ్గిర కెల్లి వాడి కళ్ళముందె రొట్టెయెత్తికెళ్ళి దాక్కున్నా. వాడాకల్తో యెతుక్కునెతుక్కొని తిట్టడానికి బదులు యెత్తుకుపోయినాడికి మేలుకోరాడండి.

కలి:— ఏంజెప్పేవురా? ఏమిటి గొణగొణలాడుతావు? కొంచెము కుదుటబడి మాట్లాడు. నీవు చెప్పేదేమిటో నాకేమీ తెలియడములేదు.

రై.దూ:— అయ్యా! నిన్నొకరైతండి పొలము దున్నుతున్నాడండి. వాడు రొట్టొకటి తెచ్చుకున్నాడని తెల్చికొని దాన్నికాస్తా కాజేసి కూసున్నా. రొట్టెత్తుకపోయినోణ్ణి తిట్టడాని కాడికదికారముంది కాదండి. కాని వాడేంచేసాడనుకున్నారు? ఎత్తుకుపోయినాడికి మేలు సేయుమని దేవుణ్ణి పార్థించాడండి.

— మంచిది. మరొకడు?

రా:—వాళ్ళంద రొకలాంటోళ్ళేనండి. నాకు సిక్కినాడు లేకపోయేడు బాబు?

— చేతులూపుకుంటూ మాదగ్గిరకు వచ్చుటకు నీకు ధైర్య మెక్కడనుండి వచ్చిందిరా? పైగా ఒకరొట్టి తెచ్చి ఇదంతా కల్పించుచుంటివా? నీవు నాతో నవ్వులాడ దలచితివాయేమి? నీకెంత మదము? అరె! నరకములోవుండి వూరికే సొమ్మంతయు తినివేయవచ్చు ననుకుంటివా? మిగతవాళ్ళందరు 10000, 20000 మందిని నరకములోని కీడ్చుకొని వస్తూవుంటే నీవు వట్టి

చేతులూపుకుంటూ వచ్చావు! గప్పాలుకొడుతున్నా వు, క్రియశూన్యం. వుండుండు. నీపనిజెపుతా.

మాత:— అయ్యా, సిక్షించకముందె నామాటినండి. వాళ్ళ పనులు తేలికండి. ఆడాళ్ళని, కోమిటోళ్ళని మోసం సెయ్యటానికి సిటుకట్టదు. వ్యాపారుల్ని, వాళ్ళని డబ్బాశపెట్టి యెన్నాటలైనా ఆడించొచ్చు. ఆడాళ్ళ కో నగలు, రంగుల్ రంగుల గుడ్డలు, తియ్యటిమిటాయి సూపిత్తే చెయ్యొదలుచుకున్నదాని కడ్డేసుంది కాని రైతులోన్నె. అమ్మో! వాళ్ళసంగతసలేరు. ఆళ్ళు కోడి కూసినప్పణ్ణుంచి సీకటి పడేదాక వొకొక్కప్పుడు అద్దరే తిరిదాకా పనిచేసుకుంటూంటారు. మళ్ళా యే పనీ దేవుణ్ణి మొక్కందె మొదలెట్టరు. అట్టాంటాళ్ళ నెవడైనా యెట్టాగండీ సిక్కించుకునేది? సామీ, నన్నీ రైతుల పన్నుండి వుంకొకపనికి మారుద్దురూ. మీపా దాలకి కోటిదణ్ణాలెడుతాను. వాళ్ళమోలాన నా పాణం యిసిగెత్తిపోయింది. మరిగత్తె మీకు కోపం నేసాను.

కలి:— ఓరి దొంగముండాకొడకా? ఎన్నిమాటలు కల్పించావు. అన్యులగురించి మాట్లాడిన లాభంలేదు. వాళ్లు కష్టపడ్డారు. మరి మనుష్యుల మోసపుచ్చుట కనేకజాలముల రచించిరి. నీవుకూడాయేదైనా వొక వుపాయము కనిపెట్టు. ఒక రొట్టెతెచ్చి వూరకమాటలు కల్పించుచున్నావు. నాల్గువైపుల మోసజాలమూ

లు పన్నితె దేనిలోనో వకదానిలో జిక్కక యేమగు
దురు? నీవిక్కడే యటునిటు తిరుగుచున్నావు. అందు
వలననె వాళ్ళునీకు చిక్కకున్నారు. ఒకవేళ అన్న
పానములవిషయములందు వారు లెక్కచేయనిచో
తమస్త్రీలకును నేర్పుదురు, గాన తక్షణమె యేదైన
యుపాయమునుగని వారెల్లర నిచట కీడ్చుకొనిరమ్ము.

దూత:— నేనేంసెయ్యాలో యేమీ బోధపడ్డంలేదు. నన్ను
పనిలోనుండి తొలగించెయ్యండి. ఇకీపని నావల్ల
కాదండీ.

కలి:— (కోపముతో) కాదూ! అట్లయిన ఏమిచేతువు?
నేనుపోయి నీ పని చేయవలయునా?

దూత:— అయ్యో, ఇకమీద టీ పనినే సెయ్యలేను.

కలి:— చేయలేవా? మంచిది. కొంచెమాగుము. ఎవ
రవతల? కొరడాతెచ్చి వీనిని మోదుము (ఆయుధ
పాణులై నిలబడియున్న భటులు కొరడాతో యా
దూతను చావబాదుదురు.)

దూత:— అయ్యో! బాబోయ్!!! అమ్మోయ్!!! అబ్బ
బ్బా!!!! (అని రోదనము జేయును)

కలి:— ఏం, ఏదైన యుపాయమాలోచించితివా?

దూత:— అయ్యో! అయ్యో!! ఇకనాను నేయలేను బాబూ.

కలి:— ఊఁ ఇంకా వెయ్ (కొంచెమాగి) ఏం, ఇప్పుడైనా
తోచినదా? యేదే నుపాయము.

దూత:— ఆ, ఆ ఆలోసించా, ఆలోసించా, ఆలోసించా,

కలి:— మంచిది. ఏమాలోచించితివి. చెప్పదేమో.

దూత:— నా నొకుపాయమాలోసించా. ఈ దెబ్బతో ఆళ్లంతా నాకు లొంగుతారు. కాని కాసంత మీారే నన్నా రైతుకు పాలేరోణ్ణి గానీయండి. సరేకా నావుపాయమేంటో యిప్పుడు సెప్పను. ఆళ్ళని సిక్కించుకునేదాక యెవరికి తెలవనీయకూడదు.

కలి:— మంచిది. కాని మూడుసంవత్సరములలో ఆ రొట్టి రైతును తీసుకొని రాలేకపోయినచో నీ హాతమార్చెదను జాగ్రత.

దూత:— మూడుసమత్సరాల్లో వాళ్ళంతా నాకు లొంగకపోతెనా ? సూడండి నాతడాకా. ఏంటనుకున్నారు ?

కలి:— సరె. మూడుసంవత్సరముల యనంతరము నేనెవచ్చి నీచర్యలజూచెద, పొమ్ము.

( తెర పడును )



# తృతీయాంకము.

( కళ్ళములో ధాన్యపురంచు లెక్కింపబడిన బండ్లు నిలబడి యుండును. దూత కూలివాని వేషధారియై బండిపై నుండి బస్తాలను దింపుచుండును. రైతు వళ్ళికలతో ధాన్యమునుదీసికొని పోవుచుండును)

కూలివాడు:— మూణు

రైతు:— ఎన్ని బత్తాలయినయిరా ?

కూలి:— డబ్బైఆరు, యేడో బత్తాలో మూడుపలికిలు.

రైతు:— ఇకందులో పట్టవు. మూడో పురికూడా నిండింది రోయ్.

కూలి:— బాగా తొక్కి తొక్కి పొయ్యాలి. అట్టా అయితే వోద్దెపడతయ్.

రైతు:— బాగా తొక్కే పోత్తండారా. (వళ్ళికతోనిమ్మ...)

కూలి:— (ఒంటరిగ తనలో పీని దీయును.) వాడు తిరిగి రావటానికి కాస్త ఆలస్యమవుతుంది. ఇంతలో నా జంతువుల్ని గాలిపోసుకోనిస్తాను. (మాయాజంతువులు లేచును) కాస్త సెప్పలుగూడా వదుల్తా. వాళ్ళెదుట అసలీటిని తీయటానికే యీల్లేదు. [చెప్పులు వదలి కూర్చుండును.] ఇది మూడోసమత్సరం. నాగ

సువు రోజుల్లోకొచ్చింది. వడ్లు దాయటానికి తళం లేకుండా వుండయ్. ఇక వాడి కొక పని నేర్పి నాయ కుడికి (కలికి) నా తమాసా అంతా సూపిత్తా ఆయన సొంతంగా సూత్తానికొత్తానన్నాడు. ఈ లోగా యే దన్నా పని చేయకపోతే లాబం లేదు. పాణంమీాద కొస్తే చేసేదేంటి. [పొరుగురైతో కడు వచ్చును. కూలివాడు తన మాయాజంతువుల నదృశ్యము చేయును.

పొ.రై:— రాం, రాం.

కూలి:— రామ్, రామ్, రామ్.

పొ.రై మీా కామందేడిరా ?

కూలి:— వడ్లు వురిలో పోసి రాటానికెళ్ళాడు. ఇంకా బోలె డొడ్లుండాయి. ఇక్కడికే మూడువుర్లు సిండాయి.

పొ.రై:— అరెరామ్, నీకామందు బాగ్గెమేమిరా ? వడ్లోసు కోటానికి తళం లేకుండిందే. ఇతనికీ రెండేళ్ళనుంచీ పండే పంట చూస్తే మాకాశ్చర్యం యేత్తోంది. అతడే పైరూడిపై అదే పండుతోంది. ఎప్పుడు నాటితే అదె మంచి యీాలుగావుంది జరగమొయ్యేదంతా యెవరో చెప్పారనుకుంటా. నిరుడు వర్సాలు తక్కువ యియ్యేడెక్కువ. ఎప్పటికప్పుడె వానల్కి తగినట్టుగా విత్తులు జల్తున్నాడు. మిగతా వాళ్ళందరి పైర్లు నాశనమైనయ్. చూడు, ఆవడ్ల గింజలెంతెంతున్నా యో !

( కొంచెము ధాన్యమును చేతిలోనికి దీసి కొని నలుపును. నలిపిన వాటిని నోట బోసి కొని నమలు చుండును. )

( రైతు ఖాళీ పళ్ళికను చేత గొని వచ్చును. )

రైతు:— ఏమయ్యో ! ఎట్టావుంది మీ పని? రాం రాం.

పొ.రై:— రాం. రాం. కాలాన్ని బట్టి యిత్తులు నాటుతున్నావని యిప్పుడే మీ పాలేరోడితో అంటున్నా. నిన్ను, నీ పంటనీ చూస్తె అందర్కీ ఆచ్చర్యం అవుత్తోంది. నీకెంత పంటపండిందయ్యా ! పదేళ్ళ దాకా నీకేమీ పరవా లేదు.

రైతు:— ఇదంతా దేముడి దయ. (కూలివానినిజూపి) వీనిఅదృష్టమే మా బాగ్గెము. పోయిన సాలు వీడిని మెరక నేను దున్నమని పంపిస్తే పల్లం దున్ని వూరు కున్నాడు. నేనప్పుడీడినెన్నో తిట్టాను గూడ. కాని వాడందులోనే యిత్తులు సల్లమన్నాడు. నేనూ అట్టాగే సేశా. దేముడిదయసేత బాగానే పండిది. ఈయేడు కూడ బాగానే పండింది.

పొ.రైతు:— వీడికెప్పుడెట్టా వర్షం కురిసేది తెల్చునుకుంటాను అందుకనే నీకింత ధాన్యం పండుతోంది. సరేగాని నేనొచ్చిన పనొకటి సెయ్యాలి ఒక బస్తా వడ్లు కావాలి వచ్చే యేడు మళ్ళా యిచ్చేస్తాను.

రైతు:— సరేలే, తీసికెళ్ళు. ఇదే నా మహాపని.

కూలి:— (రైతు నుద్దేశించి) ఊఁ ఊఁ దాన్నెమీయొద్దు.

రైతు:— ఊరుకోవోయ్. నీవు తీసికెళ్ళవయ్యా.

పా. రైతు:— మంచిది. నంచి తెచ్చుకుంటాను.

( అని పోవును. )

కూలి:— (స్వగతము) ఇంకా యీాడు మొనకటి మల్లేనే నడు త్తున్నాడే. నచ్చు లేకండా యిచ్చేత్తుండాడే అడ గ్గానే. ఇట్టాంటప్పుడు నాను సెప్పేదేమీా యీనడు. కూసేవుట్లో యిట్టా మెవ్వరికి యివ్వకుండా చేత్తాను.

రైతు:— పెద్దమణుసులొచ్చడిగితే యిమ్యొద్దని అట్టా అం తావు. తప్పు గాదంటారి.

కూలి:— ఇట్టాటాళ్ళందరికి యిమ్యాలుండమ్యాని యిత్తే మళ్ళా ఇస్తారా నత్తారా ? పట్టికెల్లట తేలిగ్గాని యి య్యటం మెంత కట్టమనుకున్నారు ?

రైతు:— పర్వాలేదు. మనికి సాలా వొస్తున్నాయి. ముం దుగ్గాపోతే ఆముందుకిత్తాడులే, అయినా యియన్నీ ఏమి చేత్తాంరా సెప్పు.

కూలి:— ఏమి సేత్తామూ ? నానీ దాన్నెంతో ఒకరసం తీత్తాను. ఏం సెప్పను. అది తాగితే నీ జన్మంతా వదిలెట్టవు.

రైతు:— ఎమిటీ ? రసం చేత్తావూ ! యెందుకు పనికొత్తా దది.

కూలి:— ఆరసం ముసలాళ్ళని పడుచాళ్ళగాను సిక్కినాళ్లని బలం కలాళ్ళగాను, చేత్తుంది. అది త్రాగినోళ్ళకు ఆక లేయదు. దప్పి వుండదు. అన్నిరోగాల్ని మాపు తుంది, ఏడ్చేవాళ్ళని నవ్విస్తుంది. నవ్వేవాళ్ళ నేడ్పి

స్తుంది. అట్టాటి రసాన్ని చేస్తా. మరేంటను
కున్నారు ?

రైతు:— బలే గప్పాలు కొడుతున్నావురా ?

కూలి:— డాబుసరి చేత్తుండానా ? నిరుడు యిద్యేడు పొలం
లో యిత్తులు నేను సల్ల మన్నప్పుడిట్లాగే అన్నావు.
చూడు మరి నేసెప్పిందెట్లా లాబం చేసిందో. ఈ
రసం గూడ చేసింతర్వాత తాగితే నీకే తెలుస్తుంది
దాని మజా.

రైతు:— సరే కాని రసమెట్లా చేత్తావు ?

కూలి:— ఈవడ్డెటి

రైతు:— అట్టైతే అంతా తినె వడ్లు పాడు సేత్తే పాపం
తగల్దూ !

కూలి:— పాపమా ! ఇయన్ని అనుభవిచ్చటానికిగాదు దేవుడి
డిచ్చింది. రసం తాగటానికేగా.

రైతు:— అదంతాసరె గాని ఒరేయ్ యిదంతా నువ్వెక్కడ
నేర్చుకున్నావురా ? నీ పనులన్నీ యిశిత్రింగా వుం
డాయే. రెండేళ్ళ నుంచీ చెప్పులిడవకుండా తొడుగు
తావు. చెప్పిందల్లా నిజమవుతోంది. ఈ గ్యాన
మంతా యెక్కడ నేర్చుకున్నావురా ?

కూలి:— నేను దేశాలన్ని తిరిగాను. మరి తెలవ
కేమవుతుంది.

రైతు:— రసం మంచ్చి బలమిత్తాదంటున్నావే !

కూలి:— ఇదంతా యెందుకండీ కూసంతాగండి తాగితే దాని
లాబం మీాకె యెరక పడతంది.

రైతు:— మరదెట్టాగో చేసేది ?

కూలి:— ఒక సారి చూత్తేనా ? తరవాత తేలిగ్గా ఎప్పుడు
పడితే అప్పుడే చేసికో వచ్చు.

రైతు:— తాగటానికి బాగా రుసిగా వుంటందా ?

కూలి:— రుశా ! అబ్బో ! ఏంరుశని సెప్పను అచ్చంగా
తేననుకోండి. నోటికి తగిల్తె మరొదిల్పెట్టరు.

రైతు:— అట్టాగా ! మంచిది. నీవు తెమ్మన్న ఇత్తడిబిం
దెలు మా పొరుగోళ్ళింటికెల్లి తెత్తానుండు.

( తెర జారును )



# చతుర్థాంకము.

——(౧)——

( కళ్ళుములో మధ్య భాగమున మూయబడిన బిందె యొకటియును, ఖాళీదొకటియును నిప్పుపై నుంచబడియుండును. రెండవ బిందె కడుగున పంపువంటి (బెజ్జముండును.)

కూలి:— బెజ్జము కడ గ్లాసునుంచి సారాయము నింపును దానిని త్రాగుచు అయ్యా, రసం తయ్యారైంది.

రైతు:— ( బొటనవ్రేళ్ళపై కూర్చొని చూచుచు ) ఎంత యిచింత్రం ! యెంతిశితౄం !! ఇందులోనుంచి నీళ్ళొత్తుండాయే. యెందుకానీళ్ళు తీత్తున్నావు ?

కూలి:— ఇది నీళ్ళు గాదు. యిదే రసం.

రైతు:— బలే శుభ్రంగావుందే. వడ్డకిమల్లె పశుపురంగుగావుంటుందనుకున్నా. అచ్చంగా నీళ్ళకిమల్లేనెవుంది.

కూలి:— కొంచెం వాసన చూడండి.

రైతు:— ఆ హా హా ! ఎట్టాటి వాసన వస్తోందంటే ! ఏదేది ? కాస్తరుసి చూస్తాను ఎట్టా వుంటుందో.

కూలి:— చూడండి. దీన్ని పోనీయకుండా తాగండి (గ్లాసు నిచ్చును.)

రైతు:— ప్రారంభమున నెమ్మదిగను తరువాత త్వరితముగను త్రాగి గ్లాసును ఖాళీ చేయును. ) ఆఁ ఇంకా కొంచెం యియ్యి అబ్బ ! ఎట్టాంటి రుశోయ్.

):- (నవ్వి)నీకిది బాగున్నట్టుందే. (మరికొంచెమిచ్చును.)

ు:- (తాగును) ఆహా హా హా,బలేగుంది. సరేకానాడా ళ్ళను కూడా పిలిత్తే బాగుంటుందే మున్నీ ? మున్నీ ? ఇట్టారా. ఇదుగో రసం తయారైంది. దబ్బునరా!

(భార్యయు, కుమార్తె చిన్న పిల్లయును వత్తురు.)

ర్య:- ఏమిటండా ? ఎందుకంత హడావిడి ?

ు:- కొంచెము నాకి సూడు. (గ్లాసు నిచ్చి) వాసన నూస్తే ఎంత మజాగా వుందో చూడవే.

:- (వాసన చూచి) ఆహా !

ు:- తాగెయ్.

:- ఏం యిబ్బంది లేదుగంద.

కు:- నీవెక్కడో పిచ్చిదాని వల్లె వుండావు. కాస్త తాగి సూడు.

:- (తాగి) అవునవును. బలేగుంది.

కు:- (మత్తులో) మంచోస్తువు. కొంచెమాగు. ఇగిగో యిది గూడా తాగు. ఈడు దీన్ని తాగితే సాలి రోగాలు గీగాలు పోతాయంటున్నాడు. పడుసాళ్లు ముసలాళ్లవుతారు, కాదు కాదు ముసలాళ్ళే పడుసాళ్ళవుతారు. ఇదిగో నేను రెండు గ్లాసులు తాగేనో లేదో అప్పుడే నావంట్లోకెంత బలం వచ్చిందనుకున్నావు ? చూశావా ? మనమిద్దరము రోజూ దీన్ని తాగితె సక్కని పడుసోళ్ళమవుతాం. రావే. దగ్గిరికి రావే, (ఆమెను కౌగలించు కొనును)

స్త్రీ:- వుండు. అవతలుండు. వీడు నిన్న బాగా షూారు ఖుణ్ణి చేసేశాడు

రైతు:- మేమిద్దరము కల్చి ధాన్నెం అంతా పాడు చేశామంటన్నావా? కాదు కాదు. మేమెటువంటి రసం తయారు చేసామో సూడు. ఏం, బాగా లేదూ?

స్త్రీ:- ఇది ముసలాళ్లని మళ్లా పిల్లాళ్లని చేత్తుందా? అట్టయితే! మంచిదే, వీడెంత శిత్రిం చేశాడు. నాగ్గాడ బలం వొత్తోంది. దా. దా. ఇక్కడికి రా. బలే మజా.
(పాడును)

ముసల్లాళ్ళంతా పడు సోల్లైతె

ఇద్దర మొకళ్లై మున మందాం

రైతు:- అదేసంగతి చూస్తూండగానే మనమంతా పడు సోళ్ళమై పోతాము. నీకిదెంత వుశారు పుట్టించిందో చూడు- నాకు గూడా మంచి సర్దాగా వుంది.

స్త్రీ:- అత్తగారిని కూడా పిలిస్తే మంచిది. ఆమెప్పుడూ నాలిగా వుంటుంది. దీన్ని తాగితే బలం వచ్చి బాగుంటుందేమొ?

రైతు:- (మత్తుగలిగి) అవునవును. అమ్మను గూడ పిలవాల్చిందే. అమ్మాయీ పోయి తాతని, నాయనమ్మని దబ్బున తీసుకురా. మళ్లీ మిమ్మల్ని పడుచాళ్ళని చేత్తామని చెప్పు. వూం పో. ఒకటి, రెండు, మూడు, పిట్టల్లె యెగిరిపో. [పిల్లపరుగెత్తును] [భార్యనుజూచి] తే వుంకొక గ్లాసియ్యి.

(కూలివాడు గ్లాసుల నింపి ఒకటొకటె ఇచ్చును.)

రైతు:— (త్రాగుచు) మొట్టమొదట నాలికి లోకి, తరవాత సేతుల్లోకి, బలం వొచ్చింది. ఇప్పుడు కళ్ళల్లోకి, బలం వొచ్చింది. ఇప్పుడు కాళ్ళల్లో కెక్కుతోంది. నేను నడవందే వాటంతటవి నడుత్తాండయి.

[ గంతులు వేయును. ]

స్త్రీ:— ( అదేపనిగ దాగుచు ) ఒరేయ్ కూలీ నీవు బలే వనాడివిరా ? ఏదీ కాస్త సారంగిని వాయించు. (కూలివాడు వాద్యమును వాయించును. రైతును, అతని భార్యయు నాట్యము చేయుదురు.)

కూలివాడు ముందుభాగమునకు వచ్చి మోగించుచుండును. వారిని జూచి నవ్వుచు కన్నుల దిప్పును).

కూలి:— (స్వగతము) ఆ. రొట్టెనాటి మోసనా కిప్పుడైనా సిక్కావులే. ఇంక నీతాతొచ్చినా మార్చలేడు. (కలిని ధ్యానించి) హేపెభో ! ఇక నీయిట్టం వచ్చి నవు డొచ్చి చూచుకో నాతమాసా.

[ఒక లావుపాటి ముసలిదిన్నీ ముసలివాడును (రైతుకు తాత) ప్రవేశించుదురు.]

వృద్ధుడు:— ఏంటిరా ? ఇదంతా! అరే ? పిచ్చెత్తిందా ఏమి ? అంతా పనిచేసుకుంటోంటే నీవిక్కడ తందనాలు తొక్కుతున్నావా ?

స్త్రీ:— ( తాళము వేయుచు నాట్యము సేయును. ) వహ్వా

వహ్వా (అని కూనరాగము తీయును)

తల్లి:— ఒసేయ్, పాడుముండా ? ఇంకా బోలీ బొచ్చీ తోమ కుండా యిక్కడ చిందులేస్తున్నా ?

రైతు:— ఉమ్మా. ఇక్కడెంతెంత మజావుందో కాస్త సూడు. మేము ముసలాళ్ళను పడుసోళ్ళుగా మారుత్తాము. ఇదిగో కాత్తి తాగిసూడు. నీకే తెలుస్తుంది.

తల్లి:— తాగటానికి నూతులో శానా నీళ్ళుండాయిలే. (వాసన చూచి) ఏంటిరా అబ్బాయి ఇందులో కలిపావు ? ఇదేమోసనరా ?

రైతు:— తాగి సూద్దూ !

తల్లి:— (రుచిచూచి) ఓహో బాగావుంది. కాని ఇది తాగితే మణుసులు సత్తారేమో !

స్త్రీ:— ఇది నీలో కొత్తప్రాణాన్ని పుట్టిత్తుంది. నువ్వు పుళ్ళా పడుచుదాని వవుతావు.

తల్లి:— ఎందుకే అంత బడాయి. (త్రాగును) చాలా బాగుంటం. ఈ రుచి గిచీ మన పానకంలో కూడా వుండదు. (మామ నుద్దేశించి) ఇదిగో నండి. కాస్త మీరుకూడ తాగి సూడండి.

కూలి:— ఆయన నట్టావుంచి ముందు మీరుంకో గ్లాసు ఎక్కించండి.

(ఆమెకొక గ్లాసు నిచ్చును.)

తల్లి:— ఏమినట్టం లేదుగందా ! కొంచెం కారంగా వుంది గాని తాగబుద్దవు తాంది.

స్త్రీ:— దీన్ని తాగు. నీవల్లంతటా పాకి బలం వత్తంది.
తల్లి:— అట్టయితే తాగిసూస్తా. (తాగును)
స్త్రీ:— ఏం, కాళ్లల్లోకిగూడా యెక్కిందా ?
తల్లి:— నిజంగా యిది బలే పని చేస్తాంది. మనచ్చు కుశారు పుట్టిత్తోందే. ఏదీ యింకా కొంచెమియ్యి [తాగి] నిజంగా నేనిప్పుడు పడుచుదాన్నయ్యా.
రైతు:— మాడు నేను నీతో సెప్పలా ?
తల్లి:— (మత్తున స్పృహదప్పి) అయ్యో ! నాభర్త లేక పోయెనే, జీవించుంటె నా యావ్వనము సూసేవాడు గందా !

[ కూలివాడు వాయిద్యమును మోగించును. రైతు దంపతులు నాట్యము సేయుదురు. ]

తల్లి:— మీరు దీన్ని నాట్యమంటున్నారా ? పబ్బే అవి గంతులు. సూడండి నేను సూపిస్తా. [గంతులువైచుచు] మొదటిట్లా. మళ్ళా యిట్టా, తర్వాతిట్టాగు. ఏం చూశారా ? [ తాతగారు సారాయిపాత్రయు కడకు బోయి గుర్రుమ్మరించును. ]
రైతు:— ( మాచి తాతగారిపైకి దుముకును ) ఓరి పాడు ముండాకొడకా; బలేపని చేసావే. అట్టాంటి మంచో స్తువుని గుమ్మరిత్తావా ? [ అని ఒక త్రోపు త్రోసి బెజ్జము కడ గ్లాసు నుంచును. ] అంతా పారబోసేదు.
తాతగారు:— ఇది మంచిది గాదు. సాల సెడ్డది. దేముడు నీకు మంచి దాన్నెం యిత్తె పాడు నీళ్ళుగా చేసేనావు.

దీనివల్ల యేమీా లాబం లేదు. ఇక దాన్నొదిలి పెట్టు. నువ్వు దీన్ని తాగేవస్తువుగా తలత్తున్నావు కాని యేంటనుకున్నావది ? నిప్పు. నిప్పు. ఇది నిన్ను కాల్చేత్తుంది. [కాలుచున్న యొక కొరివితో సారాయమును మండించును. అంతా ఆశ్చర్యంతో చూస్తుంటారు.]

[ అవనిక జారును ]



# పంచమాంకము.

——(w)——

[గుడిసెలోని లోపలి భాగము. కూలివాడొంటరిగ నుండును.]

కూలి:— దాయటానికి స్థలం గూడా లేనంత దాన్నెం వుంది. రైతుకు బాగా పిచ్చి పట్టించి కావలసినంత సారా కొనిపించాను. అందులోంచి ఒక వీసాడు దానేను గూడ. దీన్నెవరికి వూరికే యియ్యగూడదు. అవసరమొచ్చినప్పుడీళ్ళందర్ని తాగించి వశపర్చుకుంటా. ఇందుకోసమె యీాడితో గ్రామపెద్దల్నందర్ని పిలిచి విందు సేయమన్నా. మీతాత కేమీా ఆస్తి లేకుండా చేయడానికి వాళ్ళంతా అవుసరం కాబట్టి వాళ్ళను కట్టుకొని ఆస్తి అంతా వశపరచుకోలేక పోతే తాత గారు నిన్నిట్లా రసం తాగనియ్యడన్నా. గడువు మూాడుసమత్సరాలు నిండాయి. నాపని కూడ పూర్త యిందిలే. యజమాని (కలి) వచ్చి నూాసుకున్నా నాకేం బయం లేదు.

( భూమిలోనుండి కలిపురుషుడు బయల్పడును. )

కలి:— గడువయింది. నీపని పూర్తిగావించితివా ? నేను స్వయముగ వచ్చి చూతునని చెప్పియుంటిని. ఆరైతు ల్నందరిని నీవు వశపరచు కొంటివా ?

కూలి:— ఇష్టమొచ్చినట్లు వశపర్చుకున్నా. మీరు సొంతుం గా సూడొచ్చు కూనేపాగితే కొందరిక్కడికే వత్తారు. మీమూరికే పై కెక్కి దాక్కోండి. ఆళ్ళు చేసేదంతా సూసి సంతోసిత్తారు మీరె.

కలి:— (పై కెక్కి) మంచిది. చూచెదను.

(రైతు, మరినల్గురు వృద్ధులగుపెద్దలును వత్తురు. వారి వెనుక నె రైతుభార్యయు వచ్చును. అందరు కూర్చొందురు. రైతుభార్య కొన్ని యాహారపదార్థముల దెచ్చి వారి ముందుంచును. వృద్ధులు కూలివానికి సలాము చేతురు.)

1 వ పె. మ:— ఏం, ఆ రసము నింకా తయారు సేసావా ?

కూలి:— ఆ, కావలసినంత సిద్దం చేసా.

2 వ పె.మ:— బాగా రుచికరంగా వుందా.

కూలి:— ఇదివరక్కంటె యిప్పడే బాగా వుంది.

2 వ పె.మ:— సరేకాని నీవిది చేయటమెక్కడ నేర్చు కున్నావు.

కూలి:— దేశదేశాలు తిరిగేవాడి కేది తెలవదు ?

3 వ పె.మ:— నిజంగా నీవుతెలివి గలవాడిలాగే కనపడు తున్నావు.

( స్త్రీ సారాయపు బుడ్లను గ్లాసులు తీసుకొని వచ్చును. )

రైతు:— కొంచెం తాగితే గాని లాబం లేదు.

(స్త్రీ బుడ్డిని వంచి గ్లాసునింపును)

స్త్రీ:— ఇదుగో,

1 వ పె.మ:— (తాగుదురు) ఓ హో ! బలే రసం, తాగ్గానే వల్లంతా యాపిత్తోంది. నిజంగా తాగతగ్గది సుమా !
(మిగిలిన పెద్దమనుష్యులు గూడ తాగుదురు. కలి పురుషుడు క్రిందికి దిగును. కూలివాడు కలి చెంతకు బోయి నిలబడును. )

కూలి:— (కలి నుద్దేశించి) చూడండి. యిప్పుడేం తమాసా జరుగుతుందో. ఆమె సేతిలో సీసా కింద పడేటట్టుగా చేస్తాను. పూర్వము ఆకలిగా వున్నా రొట్టెత్తుకు పోయినోణ్ణి కొట్ట లేదు. వాడే యిప్పుడు ఒక గలాసు రసానికెంత తగవులాడునో సూడండి.

రైతు:— మంచిది గ్లాసునింపి వాకోక్కళ్లకే ఇమ్మ, మా సేహితునికి. తరవాత మాగోవింద తాతయ్యకి.

స్త్రీ:— గ్లాసులనింపి పెద్దలకీయబోవును. దారిలో కాలడ్డము పెడతాడు కూలివాడు. అదురుకు స్త్రీ చేతిలోని గ్లాసు క్రింద పడును.

స్త్రీ:— అయ్యో అయ్యో ఇదంతా పోయింది. చచ్చినోడా నా దోవలో ఎందుకాలెట్టావురా?

రైతు:—[భార్యతో] ఒట్టి అడివి ముండాదానా. నీచేతులో సత్తువ లేదు. పైగా ఆళ్లనీ యీళ్లనీ తిడుతున్నా. ఆ హా హా! ఎంత బంగారం వంటి సొమ్మంత పోగొట్టావే.

స్త్రీ:— నేను తెలిసి పారబొయ్య లేదు.

రైతు:— పారబొయ్యలా ! సరే వుండు. ఇప్పుడు అట్టాటిరసా

న్ని పారబోసిన దానికి ఫలమనుబవిత్తువుగాని '[కూలి వాని నుద్దేశించి] వెధవా? నువ్విక్కడేం జేస్తున్నావురా
[స్త్రీ మరల గ్లాసు నింపి ఇచ్చును]

కూలి:— (కలిపురుషుని కడకుబోయి) చూచారా, నేను సెప్పినట్లైంది. గ్లాసుడు రసం కోసం పెళ్లాన్ని కొట్టడానికి సిద్ద పడ్డాడు. పైగా నన్ను తిడుతున్నాడు.

కలి:— ఇది చాలా బాగుంది. సంతోషించాను నీపనికి.

కూలి:— కొంచెమాగండి. వాళ్లనా గ్లాసు పూర్తి చేసిందాకా ఆగితే వాళ్లెన్నాటలాడతారోసూడొచ్చు. ఇప్పుడింకా మంచిగానె మాట్లాడుతండారు. కానేపైతె శమత్కారంగా వుంటయ్యాళ్లమాటలు

రైతు:— మంచిది. నాప్రియ సేహితులారా? నా ఆస్తి విసయంలో మీా అబిప్రాయ మేమిటి? మాతాత యిందాక నాదెగ్గిరె వుండాడు. నేనే పోసి త్తన్నా. కాని ఇప్పుడాయన మాబాబాయి దగ్గిరికెల్లాడు. ఇప్పుడు తన వంతు భాగమును పంచుకొని బాబాయికే యిత్తాడంట. మీారు బుద్ధిమంతులు ఈ విషయంలో జాగ్రత్తగ ఆలోసించండి. మీాకు సమానమైనోళ్ళి వూళ్లో లేరు. ఎంకటాద్రి? సూడు వూళ్లో వాళ్ళంతా నిన్నెంత పెద్దగా చూత్తండారో నీకు తెల్దు. నారాయణసోమి నాకు పాత మిత్తుడు. మీా యిందర్కి నేనబద్దం సెపుతానేమో తెలవదంటలే.

1 వ పె. మ:— [రైతుతో] పెద్దమనుషుల్తో మాట్లాడాలి గాని లేక పోతే యేంటి. నిజంగా నీవంటి వాడు నాకెక్కడా కనపడ్లేదు నువ్వంటె నాకెంతో సంతోసము కలుగుతుంది.

2 వ పె.మ:— తెలివితేటలు, మంచితనం కావాలి. నీదెగ్గిర యుంటంచేతనే నిన్నింత పేమిస్తా.

3 వ పె.మ:— నేను నిన్నెప్పుడు తలుస్తుంటా. నిన్నే నా ఇంటావిడతో నీ గొప్పతనాన్ని గురించి సెప్పా కూడా.

4 వ పె.మ:— నిజమైన మిత్రుడివి నువ్వేనాకు.

కూలి:— (కలిని సైగతో బిలచి) ఇంటున్నారా ? ఈళ్ళంతా ఎన్నెన్ని బొంకులు బొల్లుతుండారో. ఈపెనకాల అంతా ఒకళ్ళొకళ్లు తిట్టారు. కాని యిప్పుడెట్టా పొగడుకుంటున్నారో సూడండి. ఇదంతా నా సారాయి మైమ సుమాండి,

కలి:— ఈ వస్తువు చాలా మంచిది. వీరందరూ ఇటులనే బొంకులాడుచుండుచో త్వరగనె మన పురమునకు వత్తురు. నేను పూర్తిగ తృప్తినొందితి.

కూలి:— ఇంకొంచెమాగి రెండో సీసా అయింతరవాత చూస్తే యింకా తమాసాగా వుంటంది.

1 వ.పె.మ:— ఒద్దేలేదుగందా ? (తాగును) పెద్దమనుషుల్తో పుచ్చుకుంటె సంతోషంగా వుంటుంది.

3, 4 పె.:— ఈ రసం బాగా తయారైంది. మనమంతా ఆనందంగా కాలంగడపాలి. (రైతుతో) నీవేమి శింతపడకు. అంతా నాసేతిలో పని. నేను సరి చేస్తాలే.

1 వ పె. మః— నీ నేతుల్లో వుండేఁ? ఎప్పటికీ వుండదు. ఆ పనంతా పెద్ద మణుసులుము మాదగ్గిరుంది.

4 వ పె. మః— మీరంతా పెద్దోళ్లా. పెద్దమూరుఖులు హ హ్హ హ్హ పోండి మీదారిని మీరు.

2 వ పె. మః— ఓరి తెలివి తక్కావాళ్ళల్లారా? ఏంటీగందరగోళం.

3 వ ముఃఖ్యుడుః— ఈడసలు మన్ని వూరికె తాగిత్తుండాడా యేంటి. ఆడికి పనుంది. దాన్ని తేలిగ్గా చేసుకోటానికని తాగిత్తుండాడు. (రైతుతో) పనిసిదే కాని యింకా బాగా తాగించి తిండెట్టు. మమ్ముల్ని వూజిత్తే నీపనవుతుంది లేకపోతె మాకేం, దూలా? మేం సెప్పినట్టు సెయ్యక పోతే గాడిద వవుతావు.

రైతుః— అరె. నువ్వో గాడిదవు. గాడిద కొడుకువు. గాడిద......నన్ను మోసం చేయటానికి సూత్రం డారా? మీరంతా వట్టి తిండి పోతులు. మీతో యేమీ కాదు.

1 వ ముఃఖ్యుడుః— నీపని మాతిక్క తిక్కగా వుండే. ఆచే మాట్టాడితివా మెడకాయ పిసుకుతా.

రైతుః— సరె చూద్దాము. ఎవడెవడి గొంతు నులిమేత్తాడో.

2 వ ముఖ్యుడు:— నీవొక మొనగాణ్ణనుకుంటున్నావు. చావు పోయ్యలోపడి. సెత్తో నేమాట్లాడను. నాదార్కి నేపోతోన్నా.

రైతు:— (పట్టుకొని) ఆగాగు. ఇంతసర్దాగుండె పోతావే.

2 వ ముఖ్యుడు:— నన్నొది లెయ్యోయ్. లేక పోతే అరుత్తా.

రైతు:— నేను పోనీయను. నీకేం అక్కాంది. ......?

2 వ ముఖ్యుడు :— ఇదీ అక్క. చూడు. (అనికొట్టును.)

రైతు:— (మిగతవారలతో) అరె. రండిరా. నన్ను రచ్చించండీ

( ఒకళ్ళపై నొకరు దుముకుదురు. గల్లంతగును. )

1 వ ముఖ్యుడు:— ఇదంతా తమాసా లోకి దిగింకోయ్.

2 వ ము:— అంతా నేరైటు శేత్తా నుండోశ్.

3 వ ము:— ఇంకా కొంచెము తాగాలి.

రైతు:— (భార్యతో) వుంకొక సీసా తేవే.

( అందరు కూర్చుందురు. మరల త్రాగుదురు. )

కూలి:— చూచారా. వీళ్ళంతా పొట్టేళ్ళలాగు కొట్టు కోటానికి సిద్దపడ్డారు !

కలి:— బాగానే వుంది.

కూలి:— ఇంకొంచె మాగండి. మూడో సీసా పూర్తయితే గాని మజాలేదు.

( అవనికా పతనము. )

# షష్టాంకము.

( బజారులో రైతు గృహమున కెదురుగ కొందరు మనుష్యులు రైతు తాతతో గూడి కూర్చొనియుండిరి. వారి ప్రక్కనే బాల బాలికలును, స్త్రీలును గుంపుగ గూడి పాడుచు నృత్యము చేయుచుండిరి. గుడిసెలోపల నుండి తాగుబోతుల పిచ్చిమాటలు వినవచ్చు చున్నవి. ఒక వృద్ధుడు బయ టికివచ్చి తాగిన వాని చందాన యరచును. రైతు బయ టికివచ్చి వృద్ధుని మరల లోనికి గొంపోవును. )

తాత:— అయ్యో ! వీళ్ళెంత పాడుపనులు చేత్తుండారు. రైతెప్పుడు ఒకొక్క వారము పొలము పని సూసు కుంటూ తీరికైనప్పు డల్లా పురాణం యింటమో, గుడ్డ లుతుక్కోటమో, సుట్టాలనీ ఆళ్ళనే సూసుకొని రాటమో, సీతులు దెల్సుకోటమో. పడుసాళ్ళైతే చెడుగుడాట లయ్యి ఆడుకోటమో సెయ్యాలి. అంత కంటె మనికింకేం గావాలి. ఇదుగో ఈ పిల్లల్ని చూస్తే ఎంతానంద మవుతాంది. అదీ లచ్చనం. ( గుడిసెలో కల కలము ) ఇదుగో యిదిగో యిట్టాంటి మాటలా ! ఎంత బయం ! ఎంత బయం. వీళ్ళ మూల్లాన మిగతావాళ్ళు కూడా చెడిపోతారు.

( మత్తుకు వశులైన తాగుబోతులు— గుడిసెలో నుండి బయల్పడి అరచుచుపోయి ఆడుకొనుచున్న బాలికలను బట్టుకొందురు. )

బాలికలు:— వదలిపెట్టు, గోవిందయ్యా తాతా వదిలెట్టు.

బాలురు:— ఈళ్ళకిక్క డాడుకోనిత్యారులే. ఎండవతల గొందులోకి పోదాం.

( పిల్లలందరు పారిపోదురు. )

రైతు:— ( తాతకడకు పోయి ) నీకింకేముంది. పెద్దలాస్తి నంతట్ని నాకే యిత్తారు. ( వ్రేలుచూపి ) ఇదిగో నీకే ఇది దొరుకుతుంది, ఏంటి ! కడ్డీ. తెల్సిందా. ఆస్తంతా నా వక్కడిదే, పెదాను లంతా నీకే సెప్పతారులే.

నలుగు పె.మః— మేము ముసలాళ్ళము కావటంసేత న్యాయం సెపుతాము అసలు చంగ తంతా మాకు తెల్చులేండి. రమణయ్య ( రైతు ) ది న్యాయమె.

4 వ పె.మః— రండిరా, పోదాం. మని దారిని, ( ఈ పరిథాను లందరు చేతులు మెలివేసికొని వూగిసలాడుతూ పోదురు. రైతు గుడిసెలోనికి బోవుచు క్రిందపడిపోవును. ఏమిటో వాగుచుండును. కాని యేమియు తెలియదు. తాత గారును అన్యులుకూడ పోదురు. )

( కూలివాడును కలిపురుషుడును ప్రవేశము. )

కూలి:— అరరరె ! పందివలె క్రింద పొర్లాడుచున్నాడు.

కలిపు:— మంచిపని చేసితివి. మొదట జిత్తులమారి నక్కల వలె ముఖస్తుతులు, తర్వాత పోట్లేళ్ళవలె పోరాటములు, ఇప్పుడు పందివలె పొర్లాటల! బలేభేషూ, ఆహా హా. ఏమి నీ రసమహిమ ! నీ వారసమ్మును నక్కల, పోట్లేళ్ళ, వరాహముల రక్తముతో జేసితివా?

కూలి:— కాదండీ. మామూలు తిండి పదార్థముల చేతనే చేసాను.

కలి:— ఏమిరుచి ! ఏమి వాసన !

కూలి:— (జేబునుండి సీసా నొకదానిని దీసి) ఇదిగో. దీన్ని తీసుకుని కొంచెము రుచి చూడండి.

కలి:— (తాగి వుమియును) అఖ్ థు! ఏమిటిరా ఇచ్చినది ! ఛా. వారందరు దీనినేనా తాగునది ?

కూలి:— అవునండీ.

కలి:— వారిచే దీనినెట్లు తాగించ గలిగితివి ?

కూలి:— (నవ్వి) అయ్యా, అందులోనే వుందండి శమతాకారము. సైతానులమైన మనకికూడా పనికిరాని దాన్ని వీళ్లెంతో సంతోసంగా తాగుతుండారు. మొదటీళ్ళకిది అలవాటు సెయ్యటానికి రుశొచ్చె వత్తువులు కలిపాను. తరవాత తరవాత ఈళ్ళకు అసలు వత్తువే బాగుంద.

కలి:— దీని పేరేమి పెట్టితివి ?

కూలి:— సారాయము.

కలి:— అంటే అర్థము.

కూలి:— ఏ అర్ధం గిర్ధం నాకు తెలీదు కాని తిక్కనీళ్ళని వుం కొక పేరు.

కలి:— అట్లుకాదు. దేవతా రసం అని పేరెట్టుము. అట్లయిన అందరు ప్రేమతో తాగుదురు.

కూలి:— అక్కర్లేదండి. ఈ రోజుల్లో అంతా మన సై తాను రాజగారి అదీనంలో వుంది. దేముణ్ణి తలిసే వాడే లేడు. సదువుకున్నాళ్లు పండితులోళ్ళు గూడా దీన్ని గురించి పద్దేలు వ్రాత్తారు. అన్నీ తెల్సికూడా ఆళ్ళంతా దీన్ని తాగుతుంటారు. కొత్తోళ్ళకు కూడా నేర్పుతారు. మీ రూరికే చూత్తావుందురూ! ఈళ్ళంతా దీన్ని తాగి నరకంలో నేసే పిశాచపనులన్నీ యిక్కడే నేత్తారు.

కలి:— కాని యిదంతా ఎట్లాగవుతుంది?

కూలి:— ఈళ్ళమతి బట్టమైతె అంతవుతుందా ఇంకంతవుతుందా?

కలి:— మతిభ్రష్ట మెట్లగునురా?

కూలి:— కావల్సిన దానికంటె డబ్బెప్పు డెక్కువవుతుందో అప్పుడే తెలిగ్గా మతిబట్ట మవుతుంది.

కలి:— నాకు సరిగా అర్ధము కావడములేదు. విప్పిచెప్పుము.

కూలి:— నరక మెప్పుడు డబ్బున్నాళ్ళతోనె నిండుంటుంది. గొప్ప గొప్ప సాహుకార్లు, వకీళ్ళు, బారిష్టర్లు, వ్యాపార్లు, అధికారులు, కుప్పలు కుప్పలుగా నరకంలోకి రాటంలా. కాని పనిచేసుకు పొట్టపోసుకునే కూలా

ష్య, రైతులు మన్నిక్కిస్తారూ. డబ్బుండేసే సరి,

కలి:— నిజమే కాని దీనికి కారణమేమి?

కూలి:— మనుషుని దగ్గర కావల్సినంత డబ్బుండనప్పుడు వాడి హృదయంలో బగమంతుడి బక్తి, మానవప్రేమ వుంటుంది. కష్టజీవి కాన వాడు పొరుగాళ్ళ కష్టాలు గహిత్తాడు. తన కాక లేత్తున్నా తన దెగ్గిరున్న రొట్టిలో చగం పక్కోడికివ్వటానికి వప్పుకుంటాడు. కాని డబ్బెక్కువగా వుండగానె లోబం, స్వార్ధం, మదం సేరతాయి. అప్పుడన్నీ మర్చిపోయి డబ్బు పోగు సెయ్యటమే దర్మం అనుకొంటాడు.

కలి:— నీవు చెప్పిన దంతా నిజమె.

కూలి:— సూడండి నీళ్ళు పారుతున్నంత సేపు సుబ్రంగాను రుసికరంగా నుంటాయి. కాని ఒకసోట నిలవుండేటప్పటికి మురికిగాను, వాసనగాను వుంటయి. గదిలో గాలి బాగా వచ్చినంతసేపు బాగానె వుంటుది కాని తలుపులు మూస్తే బొగ్గ వుల్చవుతుంది. అట్టాగే డబ్బుకూడా అందరిదగ్గిరకు సమానంగా వెడుతుంటె సరె లేక ఒకరిదగ్గిరికి సేరిందా ఇక అందర్ని మాడ్చి ఒక్కడికె సేర్చటానికి కారణమవుతుంది.

కలి:— నిజమె, నిజమె.

కూలి:— లోకులంతా అవసరమైతె శద్దాబక్తుల్తో తల్లికి మళ్లె లచ్మిని కొలుత్తారు. లచ్మింటి కొచ్చినప్పుడు చుట్టాలు పక్కాలతో వుచ్చవాలు సేత్తారు కాని లచ్మి వాళ్ళింట్లో

యెక్కువ కాలముంటె తర్వాత దాన్ని పెట్టెలో పెట్టి తాళాలేత్తారు. లచ్మి కట్టపడి ఈళ్ళనుద్దరిచ్చటానికొస్తె దాసీదాన్నికిమల్లె బంధిచ్చటము నరకానికి పోటానికి గాదూ !

లి:— సరేగాని అటుల గాక పోవుచో మన లోకానికి ముప్పొస్తుంది సుమా.

హాలి:— చందేహంలేదు. బాగ్గెమంతుల బిడ్డలు అరక్క సస్తుంటె బీదోళ్ల పిల్లలాకలితో సచ్చేదెట్టాగు. మరికలవాళ్ల పెళ్లాలు యభిశారం చెయ్యక పేదాళ్ల యింటాళ్ళకు అభిమానం లేక పోతే మని నోట్టామట్టిగా.

లి:— నిజమే చెప్పుచుంటివి గాని ఈ రహస్యం యెవరికి తెలియ గూడదు

హాలి;— ఏబ్బే యిదంతా యెరిగిందేనండీ. దర్మం నోరుచింపుకు సెప్పినా యినేవాడెవడు? అంతా కళ్లున్నా గుడ్డోళ్లే. చెవులున్నా శెవిటోళ్లే. ఇదంతా సూత్తే సొర్గంకంటె మన నరకంగొప్పదనీ బలం గలదనీ తెలుత్తోంది.

లి:— ఓయీ, నీ యుక్తికి మెచ్చాను.

హాలి:— డబ్బు, కల్లు, ముండ ఈ మూడూ వుంటె యీ పెపంచకంలో లొంగనోడుండాడా?

లి:— భేష్. ఇక నిన్ను యమదూతలపై సర్దారుగ నియమింప యత్నింతును. యమునితో సిఫార్సు చేసెదను గాని మనం పోదాము రా.

(ఇద్దరు బయల్దేరుదురు; హాలివాడు కాదు రైతులదూత మీసము వడి వేయుచు పోవును.) [యవనిక జారును.]

సంపూర్ణము.

# ఆదర్శగ్రంథనిలయ నియమములు.

రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక, ఇతిహాసిక గ్రంథములను లోకోత్తర స్త్రీపురుషుల జీవితములను సమర్థులగువారిచె వ్రాయించియు, అనువదింపజేసియు ప్రకటింపబడును.

సం॥ 1కి మొత్తం వేయిపేజీల గ్రంథములు ముద్రించబడును. వేయిపేజీల గ్రంథములును చందాదారులకు (పోస్టేజిగాక) మూడు రూపాయల కీయబడును. పోస్టేజితో సం॥ చందా రు. 4.

చిన్న గ్రంథములు ప్రకటించునో రెండు మూడు గ్రంథములు వెలువడనిదె వీ పీ చేయము. చందాదారులకు వీ పీ చేయుటకు 10 దినములకు ముందు తెలియపరతుము.

చందాదారులు మండలి గ్రంథము లన్నిటిని కొనవలెను.

ప్రతిసభ్యుడును ప్రవేశరుసుము యెనిమిదణాలు చెల్లించవలెను.

అన్యప్రకాశకుల గ్రంథము లుత్తమమైనవి మా అనుబంధములుగ విక్రయింతుము. వాటి వివరము లన్యత్రజూచి తెప్పించుకొనవచ్చును. గతనియమములు రద్దు.

మేనేజరు.

# వెలువడిన గ్రంథములు.

౧ బ్రహ్మచర్యము. (సచిత్రము)
250 పేజీలు, వెల ఒక రూపాయి.

౨ దేవీ జోన్. (సచిత్రము)
ఫ్రాన్సు స్వాతంత్ర్యరమణి జీవితము.
వెల పన్నెండణాలు.

3 భారతీయ ప్రబోధము.
ఖద్దరు, మద్యపానాదులగూర్చిన పద్యములు.
వెల ఒక అణా.

౪ కర్షుని కాలగతి.
టాలుస్టాయి రచితము.
వెల, నాల్గణాలు

౫ డీవేలరా. (సచిత్రము)
షుమారు 280 పేజీలు, వెల ఒక రూపాయి.

# ఆదర్శ గ్రంథ మండలిలో లభించు

# అన్యగ్రంథములు.



| | |
|---|---|
| వినాయకసావర్కారు | 1—0— |
| ఝాంసీలక్ష్మీబాయి | 0—12— |
| మేజినీ | 0—10— |
| బార్డోలీ విజయము | 1—0— |
| ఉత్కలపతనము | 1—0— |
| నందకుమారవధ | 0—8— |
| మాతృపూజ | 0—5— |
| శాంతిసమరము | 0—4— |
| అన్నపూర్ణాదేవిలేఖలు | 1—0— |
| వైదికసభ్యత | 1—0— |
| వివేకానంద | 1—8— |
| సుజ్ఞానచంద్రోదయము | 1—0— |
| జీవకారుణ్యము | 0—12— |
| భానుమతి | 1—8— |
| అష్టాదశమహాపాతకులగు బ్రాహ్మణులకేల సహాయనిరాకరణముచేయవలెను. | 2—8— |

పై గ్రంథములన్నియు నొక్కసారి తీయువారికి 4 వంతు ఖరీదుకే యివ్వబడును.